## అథ షడ్వింశో%ధ్యాయః

## వ్యాఘ్రమునకు ఉత్తమగతి లభించుట

వాయురువాచ |

ఉత్పాద్య కౌశికీం గౌరీ బ్రహ్మణ    ప్రతిపాద్య తామ్ | తస్య ప్రత్యుపకారాయ పితామహమథాబ్రవీత్ || 1

వాయువు ఇట్లు పలికెను -

గౌరి కౌశికికి జన్మనిచ్చి ఆమెను బ్రహ్మకు అప్పజెప్పి, తరువాత దానికి ప్రత్యుపకారమును గోరి ఆమె పితామహునితో నిట్లు పలికెను (1).

దేవ్యువాచ |

దృష్టఃకిమేష భవతా శార్దూలో మదుపాశ్రయః | అనేక దుష్టసత్త్వే భ్యో రక్షితం మత్తపోవనమ్ || 2

మయ్యర్పితమనా ఏష భజతే మామనన్యధీః | అస్య సంరక్షణాదన్యత్ప్రియం మమ న విద్యతే || 3

భవితవ్యమనేనాతో మమాంతఃపురచారిణా | గణ   శ్వరపదం చాస్మై#ె ప్రీత్యా దాస్యతి శంకరః || 4

ఏనమగ్రేసరం కృత్వా సఖీభిర్గంతుముత్సహే | ప్రదీయతామనుజ్ఞామే ప్రజానాం పతినా త్వయా || 5

ఇత్యుక్తః ప్రహసన్ బ్రహ్మా దేవీం ముగ్ధామివ స్మయన్ | తస్య తీవ్రైః పురావృత్తైర్దౌరాత్మ్యం సమవర్ణయత్ || 6

దేవి ఇట్లు పలికెను -

నన్ను ఆశ్రయించుకొని యున్న ఈ పెద్దపులిని నీవు చూచితివా?ఇది నా తపోవనమును దుష్టమృగముల బారినుండి కాపాడినది (2). ఇది మరియొక విషయము వైపునకు బుద్ధిని మళ్లించకుండగా, నాపై అర్పించబడిన మనస్సు గలదై నన్ను సేవించుచున్నది. నాకు దీనిని సంరక్షించుట కంటె మరియొక ప్రీతికరమైన విషయము లేదు (3). కావున, ఇది నా అంతఃపురములో సంచరించునది కావలెను. శంకరుడు దీనికి ప్రీతితో గణాధ్యక్ష పదవిని ఈయగలడు (4). ఇది ముందు నడుచుచుండగా నేను సఖురాండ్రతో గూడి నడువవలెనని కోరుచున్నాను. ప్రజాపతివగు నీవు నాకు అనుమతిని ఈయవలెను (5). ఆమె ఇట్లు పలుకగా బ్రహ్మ నవ్వి, దేవికి తెలియదా యన్నట్లు ఆ పెద్దపులి పూర్వములో చేసిన చెడు పనులతో కూడిన దుష్టస్వభావమును గురించి చక్కగా వర్ణించెను (6).

బ్రహ్మోవాచ |

పశౌ దేవి మృగాః క్రూరాః క్వ చ తే%నుగ్రహశ్శుభః | ఆశీవిషముఖే సాక్షాదమృతం కిం నిషిచ్యతే || 7

వ్యాఘ్రమాత్రేణ సన్నేష దుష్టః కో%పి నిశాచరః | అనేన భక్షితా గావో బ్రాహ్మణాశ్చ తపోధనాః || 8

తర్పయంస్తాన్ యథాకామం కామరూపీ చరత్యసౌ | అవశ్యం ఖలు భోక్తవ్యం ఫలం పాపస్య కర్మణః || 9

అతః కిం కృపయా కృత్యమీదృశేషు దురాత్మసు | అనేన దేవ్యాః కిం కృత్యం ప్రకృత్యా కలుషాత్మనా || 10

బ్రహ్మ ఇట్లు పలికెను -

పశుజాతికి చెందిన ఈ మృగములు క్రూరమైనవి. ఓ దేవీ!శుభకరమగు నీ అనుగ్రహము ఎక్కడ ప్రసరించు చున్నది?సాక్షాత్తుగా పాముయొక్క నోటిలో అమృతమును పోయుచున్నావా యేమి? (7) ఇది కేవలము పెద్దపులి రూపములోనున్న ఎవరో ఒక దుష్టుడగు రాక్షసుడై

యుండును. ఇది గోవులను, తపోధనులగు బ్రాహ్మణులను భక్షించినది (8). కామరూపియగు ఈ రాక్షసుడు తనకు నచ్చిన రూపమును దాల్చి, ఆ రూపమునకు తృప్తిని కలిగించుచూ సంచరించుచున్నాడు. ఈతడు పాపకర్మయొక్క ఫలము తప్పక అనుభవించ వలెను (9). కావున, ఇట్టి దుష్టులయందు దయను చూపుట వలన ఏమి ప్రయోజనము?స్వభావముచే దుష్టబుద్ధియగు ఈ పులితో దేవికి పని యేమి? (10).

దేవ్యువాచ |

యదుక్తం భవతా సర్వం తథ్యమస్త్వయమీదృశః | తథాపి మాం ప్రపన్నో%భూన్న త్యాజ్యో మాముపాశ్రితః || 11

దేవి ఇట్లు పలికెను -

నీవు చెప్పిన విషయము అంతయు సత్యమే యగుగాక! ఈ పులి అట్టిదియే. అయిననూ, నన్ను ఆశ్రయించి శరణు పొందినది గనుక, దానిని విడిచి పెట్టుట నాకు తగదు (11).

బ్రహ్మోవాచ |

అస్య భక్తిమవిజ్ఞాయ ప్రాగ్వృత్తం తే నివేదితమ్ | భక్తిశ్చేదస్య కిం పాపైర్నతే భక్తః ప్రణశ్యతి || 12

పుణ్యకర్మాపి కిం కుర్యాత్త్వదీయాజ్ఞానపేక్షయా | అజా ప్రజ్ఞా పురాణీ చ త్వమేవ పరమేశ్వరీ || 13

త్వదధీనా హి సర్వేషాం బంధమోక్షవ్యవస్థితిః | త్వదృతే పరమా శక్తిస్సంసిద్ధిః కస్య కర్మణా || 14

త్వమేవ వివిధా శక్తిః భవానామథ వా స్వయమ్ | అశక్తః కర్మకరణ కర్తా వా కిం కరిష్యతి || 15

విష్ణోశ్చ మమ చాన్యేషాం దేవదానవరక్షసామ్ |
తత్తద్రైశ్వర్యసంప్రాప్తై#్య తవైవాజ్ఞా హి కారణమ్ || 16

అతీతాః ఖల్వసంఖ్యాతా బ్రహ్మాణో హరయో భవాః |
అనాగతాస్త్వసంఖ్యాతాస్త్వదాజ్ఞానువిధాయినః || 17

త్వామనారాధ్య దేవేశి పురుషార్థచతుష్టయమ్ | లబ్ధుం న
శక్యమస్మాభిరపి నర్వైస్సురోత్తమైః || 18

వ్యత్యాసో%పి భ##వేత్సద్యో బ్రహ్మత్వస్థావరత్వయోః | సుకృతం
దుష్కృతం చాపి త్వయైవ స్థాపితం యతః || 19

త్వం హి సర్వజగద్భర్తుశ్శివస్య పరమాత్మనః | అనాదిమధ్యనిధనా
శక్తిరాద్యా సనాతనీ || 20

సమస్తలోకయాత్రార్థం మూర్తిమావిశ్య కామపి | క్రీడసే వివిధైర్భావైః
కస్త్వాం జానాతి తత్త్వతః || 21

బ్రహ్మ ఇట్లు పలికెను -

దీని భక్తిని గురించి నాకు తెలియక పోవుటచే, నేను దీని పూర్వవృత్తాంతమును చెప్పియుంటిని. దీనికి భక్తి యున్నచో, పాపములతో పని యేమి ? నీ భక్తునకు వినాశము లేదు (12). పుణ్యాత్ముడైననూ నీ యాజ్ఞను అపేక్షించ కుండగా ఏమి చేయగలడు? పుట్టుక లేని సనాతనమగు ప్రజ్ఞ పరమేశ్వరి యగు నీ స్వరూపమే (13). సర్వప్రాణుల బంధమోక్షవ్యవస్థ నీ అధీనములో నున్నది. పరమశక్తిస్వరూపిణివి అగు నీవు లేనిచో, కర్మ వలన ఎవనికి సిద్ధి లభించును? (14) ప్రాణులలో వివిధరూపములలోనుండే శక్తివి నీవే. స్వయముగా కర్మలను చేయుటలో అసమర్థుడగు కేవల కర్త (శక్తి లేనిదే) ఏమి చేయగలడు? (15) విష్ణువు, నేను, ఇతరులగు దేవతలు, దానవులు, రాక్షసులు ఆయా ఐశ్వర్యములను పొందుటకు నీ ఆజ్ఞయే కారణము (16). నీ ఆజ్ఞను పాటించే బ్రహ్మవిష్ణురుద్రులు లెక్క లేనంత మంది గడచి పోయినారు; ఇంకనూ లెక్క లేనంత

మంది రానున్నారు (17). ఓ దేవదేవీ! దేవతలలో శ్రేష్ఠులమగు మేమందరము కూడా నిన్ను ఆరాధించనిదే చతుర్విధ పురుషార్థములను పొంద శక్యము కాదు (18). నీవు బ్రహ్మను చెట్టుగను, చెట్టును బ్రహ్మగను మార్చి వేయగలవు. ఏలయనగా, పుణ్యపాపములను స్థాపించునది నీవు మాత్రమే (19). సర్వజగత్తులకు ప్రభువగు శివపరమాత్మయొక్క ఆదిమధ్యాంతములు లేని శక్తివి నీవే. సనాతనురాలవగు నీవే సర్వమునకు కారణమగుచున్నావు (20). నీవు ఏదో ఒక రూపమును దాల్చి వివిధప్రాణులతో క్రీడిస్తూ సమస్తలోకములను నడిపించు చున్నావు. నిన్ను యథార్థముగా ఎవడు తెలియగలడు? (21).

అతో దుష్కృతికర్మాసి వ్యాఘ్రోఽయం త్వదనుగ్రహాత్ | ప్రాప్నోతు పరమాం సిద్ధిమత్ర కః ప్రతిబంధకః || 22

ఇత్యాత్మనః పరంభావం స్మారయిత్వానురూపతః | బ్రహ్మణాభ్యర్థితా గౌరీ తపసోఽపి న్యవర్తత || 23

తతో దేవీమనుజ్ఞాప్య బ్రహ్మణ్యంతర్హితే సతి | దేవీ చ మాతరం దృష్ట్వా మేనాం హిమవతా సహ || 24

ప్రణమ్యాశ్వాస్య బహుధా పితరౌ విరహాసహౌ | తపః ప్రణయినో దేవీ తపోవనమహీరుహాన్ || 25

విప్రయోగశుచేవాగ్రే పుష్పబాష్పం విముంచతః | తత్తు చ్ఛాఖాసమారూఢవిహగోదీరితై రుతైః || 26

వ్యాకులం బహుధా దీనం విలాపమివ కుర్వతః | సఖీభ్యఃకథయంత్యేవం సత్వరా భర్తృదర్శనే || 27

పురస్కృత్య చ తం వ్యాఘ్రం స్నేహాత్పుత్రమివౌరసమ్ | దేహస్య ప్రభయా చైవ దీపయంతీ దిశో దశ || 28

ప్రయ ¸ిమందరం గౌరీ యత్ర భర్తా మహేశ్వరః | సర్వేషాం జగతాం ధాతా కర్తా పాతా వినాశకృత్ || 29

ఇతి శ్రీ శివమహాపురాణ    వాయవీయసంహితాయాం పూర్వఖండే వ్యాఘ్రస్య ఉత్తమ గతివర్ణనం నామ షడ్వింశో%ధ్యాయః (26).

కావున, ఈ పెద్దపులి చెడ్డ పనులను చేసినదే అయినప్పటికీనీ అనుగ్రహముచే సర్వోత్కృష్టమగు సిద్ధిని బడయుగాక! దీనిలో ప్రతిబంధకమేమున్నది? (22) ఈ విధముగా యథోచితముగా బ్రహ్మ తనకు గల గొప్ప భక్తిని గుర్తు చేసి ప్రార్థించగా, పార్వతి తపస్సును కూడ విరమించెను (23). తరువాత దేవియొక్క అనుమతిని పొంది బ్రహ్మ అంతర్ధానమును చెందగానే, ఆ దేవి తల్లియగు మేనను మరియు తండ్రియగు హిమవంతుని దర్శించి (24), నమస్కరించి, విరహమును సహించ లేకున్న తల్లిదండ్రులను పలువిధములుగా ఓదార్చెను. తపోవనము నందు దేవి తపస్సు చేయుచుండగా ఆమెకు అచటి వృక్షములపై ప్రేమ ఉండెను (25). అవి ఆమె వియోగముయొక్క దుఃఖము కలవా యన్నట్లు పుష్పములనే బాష్పములను విడిచిపెట్టి, కొమ్మలను ఆశ్రయించి యున్న పక్షుల కిలకిల ధ్వనులచే పరి పరి విధములుగా దీనముగా విలపించు చున్నవా యన్నట్లు ఉన్న దృశ్యమును ఆమె చెలికత్తెలకు వర్ణించి చెప్పెను .ఆమె భర్తను దర్శించుటకై తొందర పడుచుండెను (26, 27). ఆ గౌరి కన్న కొడుకును వలె ప్రేమించే పెద్ద పులిని ఎదుట నుంచుకొని, తన దేహముయొక్క కాంతిచే పది దిక్కులను ప్రకాశింపజేయుచూ, సర్వలోకములను సృష్టించి పాలించి పోషించి వినాశము చేసే తన భర్తయగు మహేశ్వరుడు ఉన్న మందిరమునకు పయనమయ్యెను (28, 29).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో వ్యాఘ్రము దేవికి వాహనమగుటను వర్ణించే ఇరువది ఆరవ అధ్యాయము ముగిసినది (26).